శ్రీ

# సకలేశ్వరశతకము.

పీఠికాపుర వాస్తవ్యుఁడగు

దేవగుప్తపు భారద్వాజముచే

రచింపఁబడినది.

మొదటి కూర్పు 500 ప్రతులు.

పిఠాపురము:

శ్రీ విద్వజ్జనమనోరంజనీ ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడినది.

1910.

వెల రు 0-1-0.

శ్రీ

# సకలేశ్వరశతకము.

ఇది

పిఠికాపుర వాస్తవ్యుఁడగు

దేవగుప్తపు భారద్వాజముచే

రచింపఁబడినది.

మొదటి కూర్పు 500 ప్రతులు.


పిఠాపురము:

శ్రీ విద్వజ్జనమనోరంజనీ ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడినది.

1910.

వెల రు 0-1-0.

శ్రీ రస్తు.

# సకలేశ్వరశతకము.

ఉ. శ్రీయుతుఁడై సమస్తజన • సేవ్యుఁడునై జగదంతరాత్ముఁడై
యేయెడఁదానయై వెలుఁగు • నీశ్వరుఁడాద్యుఁడునై సశ్రీకరుం
డాయతసర్వసౌఖ్యముల • నభ్యుదయంబుగ నిచ్చి ప్రోవుతన్
న్యాయపథానువర్తిని శ్రీ • తానసదత్సుని సూర్యరాట్ప్రభున్.

క. కందముల నూటి నిప్పుడు
పొందుపఱిచి కాన్క నిడుదు • బుధచయము మెల్లన్
జెందఁగ మోదము, కృపతో
సందియములఁ ద్రోచి ప్రోవు • సకలేశా! 1

క. నీదయ గలిగిన జనులకు
నేదియుఁ గొఱయొదవకుండ • నిల మంగళముల్
పాదుకొను సర్వవిఘ్నముల
సాదరకరుణాంతరంగ • సకలేశా! 2

క. పూనిక నీపదయుగళ
ధ్యానరతుం డయ్యెనేని • ఘనసంసారాం
భోనిధి దాఁటఁగ సులభము
మానితగుణాభవవినాశ • సకలేశా! 3

క. పామరుఁడు నీదుభక్తిని
నేమరకను దగిలియున్న ♦ నిహపరసుఖముల్
గామించి యొసఁగుదాతవు
నీమహిమలు నెన్న నేర్తు ♦ నే? సకలేశా! 4

క. నీవే దిక్కని నమ్ముచు
నా వేగమె కృప దలిర్ప ♦ రక్షించెదునీ
సేవను జేయుచు మనుజుఁడు
గాపఁబడును భవమునుండి ♦ కడుసకలేశా! 5

క. చేసినపాపచయంబుల
నాసిల్లఁగఁ జేయు విభుఁ ♦ డ న్నీకన్నన్
జేసినవి గలవు పెక్కులు
వేసటపడకుండఁ గావు ♦ విభుసకలేశా! 6

క. వగనైన భీతినైనను
బగనైనను నీదుచరణ ♦ పంకజములు తాఁ
దగిఁ గొల్చి ముక్తిపదమును
నెగడుటకును సందియంబె ♦ నెఱిసకలేశా! 7

క. సర్వము నీలోనుండుట
సర్వము నీవగుట నెఱిఁగి ♦ సదమలబుద్ధిన్
సర్వము నీకల్పితమని
సర్వము నీకొసఁగవలయు ♦ సత్సకలేశా! 8

క. అన్నము పెట్టెడువానిని
నెన్నఁడు దూషింపఁగూడ ♦ దేర్పడఁదల్లుల్
చన్నులపా ల్వోసఁ ద్రాగుచుఁ
దన్నెడుగతి గాదె తలఁప ♦ ధర సకలేశా! 9

క. జననీజనకుల కెప్పుడు
వినయముతో వాంఛితముల ♦ వెసఁ గూర్చువాఁ
డొనరఁగఁ బుత్త్రుఁ డనం జను
వినయము నుతి కెక్కు నిలను ♦ వెస సకలేశా! 10

క. ఎన్నెన్ని నేర్చి యుండిన
నెన్నెన్నో చూచియున్న ♦ నిష్ఫలమగుఁగా
అన్నియు నున్నన్ని పోవును
చెన్నగు నొకసతి లేక ♦ క్షితి సకలేశా! 11

క. ఎన్నెన్నో చెప్పు నీతుల
నిన్నిటిలోఁ గొన్నియైన ♦ నెద నుంచక తా
నున్నగతి నుండుఁ గుజనుఁడు;
మున్నె బుధుఁడు చేసి చెప్పు ♦ భువి సకలేశా! 12

క. గుణహీనునిగర్భంబున
గుణవంతుఁడు గల్గు నెన్న ♦ గుర్తింపంగా
ఫణిరాజుమస్తకంబున
మణిబుట్టినరీతిఁ గాదె ♦ మహిసకలేశా! 13

క. పతితోడఁ గలహమాడెడు
సతితోఁ గాపురముకన్న ♦ సన్న్యాసంబే
నుతిఁ గాంచు సర్వవిధముల
నతి మంచిది దొరకు టరుదు ♦ సత్సకలేశా! 14

క. పరుసములు పలుకవలవదు
పరుసవాక్యములు సభల ♦ నింద్యంబులగున్
సరసపుఁబలుకులె మేలుగ
నిరతము పలుకంగ వలయు ♦ నెఱి సకలేశా! 15

క. తన కెంతకష్ట మొదవినఁ
బనివడి నిజమెపుడుఁ బల్కు ♦ భద్రముగలుగున్
బనిలేక కల్లలాడెడు
మనుజునకును బాధ లొదవు ♦ మహి సకలేశా! 16

క. పరపురుషులఁ జూడనిదే
పరమపతివ్రత యనంగఁ ♦ బఱఁగును ధరలోఁ
బరనారులఁ దల్లులుగా
సరిచూచెడువాఁడె ఘనుఁడు ♦ సత్సకలేశా! 17

క. పరమునిసన్నిధి నెప్పుడు
వరపండితవర్గ మెల్ల ♦ వసియించు వెసన్
ధరలోన హంసనిచయము
సరసులఁ దగఁ జేరురీతి ♦ సత్సకలేశా! 18

క. తన కెంతజరుగ కుండిన
వినయముతో యాచకునకు ♦ విసవిసపడకే
తన కున్న దానిలోపల
నొసఁగూర్చెడువాఁడె భవ్యుఁ ♦ డొగిసకలేశా ! 19

క. న్యాయము తప్పక మనుజుఁడు
కాయం బస్థిరమటంచుఁ ♦ గనుఁగొని వివిధో
పాయములఁ బాటుపడుచును
జేయవలయు ధనము మిగుల ♦ క్షితిసకలేశా ! 20

క. తాను గడించినధనమును
దానమునకు ధర్మమునకుఁ ♦ దగుగతి నిడుచున్
మానితవైఖరి మిగిలిన
దానిని దాఁచంగవలయు ♦ ధరసకలేశా ! 21

క. ధనసంపాదన గలిగినఁ
దనవారందఱును భక్తి ♦ తాత్పర్యములన్
బెనఁగొనుచుండెద రెపుడున్
ధనహీనునిఁ జేర రెవరు ♦ ధర సకలేశా ! 22

క. తనదేహము లోకులకై
యనయము సర్పించి మిగుల ♦ నానందముతోఁ
దనిపెడు పురుషుఁడె పురుషుఁడు
మనుజాధముఁ డితరుఁ డెన్న ♦ మహి సకలేశా ! 23

క. తనవలె నందఱిఁ జూచుచు
మనువాఁడే జ్ఞాని యనఁగ ♦ మహిలో నొప్పున్
దనలాభమె తాఁ గోరుచుఁ
జనువాఁ డజ్ఞాని యనఁగఁ ♦ జను సకలేశా! 24

క. అనయము పరుల హితంబే
తనహితముగ నెంచువాఁడు ♦ ధన్యుఁడు భువిలోఁ
దనహితముఁ దానుగోరెడు
మనుజుని నీచుఁ డనవలయు ♦ మహి సకలేశా! 25

క. వినవలయు భారతంబును
గనవలయును బ్రహ్మపదవి ♦ కడుశ్రమచేతన్
జనవలయు ధర్మపథములఁ
గొనవలయును భక్తిఁ జాల ♦ గురుసకలేశా! 26

క. ఒక్కనికలిమికి మదిలో
వెక్కసపడి చింతచేత ♦ వేఁగెడుపురుషుం
డొక్కఁడెపో తెవులంటక
చిక్కులుపడువాఁడు మిగుల ♦ క్షితిసకలేశా! 27

క. ఏచినధర్మం బొకటియె
కాచును గష్టములనుండి ♦ కనుమిం పెసఁగన్
నైచినవృక్షమునుండియుఁ
గాచినఫల మనుభవించు ♦ గతి సకలేశా! 28

క. చేదు తినునట్టినోటికి
స్వాదౌదనము రుచిఁ దెలుపునె? సచ్ఛీలంబుల్
మోదముఁ గూర్చ వెట్లును
సూదులగతి ఖలుని చెవికి ♦ శుభసకలేశా! 29

క. ఉల్లముసఁ గుచ్చితంబును
జల్లనిపలుకులును గలిగి ♦ సందర్భముగాఁ
జెల్లున కిలకాలంబును
వెల్లడిగాకుండఁ గ్రియల ♦ వెస సకలేశా! 30

క. ఇంచుక జలముల నిడుచుఁ బెంచిన నారికెడ మిచ్చు ♦ పెనుపండ్లగెలన్
మంచి నొడగూర్చు సుజనుం
డెంచి మఱి మేలుసేయు ♦ నిల సకలేశా! 31

క. ఘనకార్యకలభారము
ఘనులకుఁ గాకితరులకును ♦ గన శక్యంబే
వనజమధుమధుర మళులకుఁ
గనఁగా నగునె గలెల్లు ♦ కను సకలేశా! 32

క. కోత యగునట్టిసంస్కృతి
ఖ్యాతియు లేనట్టి బ్రదుకుఁ ♦ గడునీచ్యంబుల్
మాతులునియుంటివాసం
జేసేరుసఁ గోరుఁ బ్రాజ్ఞుఁ ♦ డిల సకలేశా! 33

క. నిర్ధనజీవనమే భువి
వ్యర్థము పురుషార్థములక ♦ నర్థము గానన్
అర్థము సన్మార్గంబుల
నర్థిఁ గూర్పంగవలయు ♦ హర సకలేశా! 34

క. కయ్యమునకుఁ గాల్ద్రివ్వక
నెయ్యంబునఁ బనదు కార్య ♦ నిచయం బెల్లన్
జయ్యన నొనఁగూర్చుచుఁ దా
నొయ్యన జీవింపవలయు ♦ నో సకలేశా! 35

క. దక్షత లేకుండెడు తెలి
లక్షలు వచ్చినను బోవు ♦ లాభము లేకే
తక్షణమె గండివేసిన
పక్షమునను జెఱువునీరు ♦ వలె సకలేశా! 36

క. పసులు చెడుఁ గసవు లేకను
ధన మేమియు లేక చెడును ♦ బంగారింబున్
బసివాఁడు చెడును ప్రేమను
పసిలేకను చెడును శూరుఁ ♦ డని సకలేశా! 37

క. వ్యసనములఁ జెడును పురుషుఁడు
రసభావము లేక చెడును ♦ రహిఁ నాట్యంబున్
వెస చెడుఁ గృషి చూడమిచేఁ
బస లేకను గతియుఁ జెడును ♦ భవ సకలేశా! 38

క. మతి చెడు సంసారంబున
యతి చెడు సంసర్గమునను ♦ సహయముఁ బూర్ణ
బతి చెడు బహుభార్యలచే
సతి చెడు స్వైరిణులగోష్ఠి ♦ సత్సకలేశా ! 39

క. ఇడుమల మిత్త్రునిగుణమును
గడు బీదతనంబునందుఁ ♦ గలికిగుణంబుల్
గొడుకులగుణములు తండ్రుల
కడువృద్ధాప్యమునఁ దెలియుఁ ♦ గన సకలేశా ! 40

క. పక్షులు చేరును చెట్లను
చక్షులు సొగసైనవస్తు ♦ చయములఁ జేరుల్
భిక్షుకులు దానశీలుర
మోక్షమునం జేరుచుందురు ♦ మహి సకలేశా ! 41

క. కలిపెట్టి యీనిత్యాగము
తలవారలఁ ద్రోచి పరులఁ ♦ దనిపెడిధనముల్
దనసతి మెచ్చనివిభవము
గన వ్యర్థము గాదె భువిని ♦ ఘన ! సకలేశా ! 42

క. ఇచ్చి పగఁ జెందు కంటెను
హెచ్చగునీచపుగుణంబు ♦ లేద నూహింపన్
వచ్చునె మఱియొక ట్రీధ
నచ్చుపడఁగ దానినాటి ♦ యడె సకలేశా ! 43

క. నీరముఁగను దగ దీరును
ఘోరంబునఁ గూర లెల్ల ♦ కదురుచు లోందుఁగ్
బీరముస సర్వశుభములు
హారంబున పెకు మమరు ♦ హర సకలేశా! 54

క. తేలునకు విషము తోఁకను
వాలుంగంటులకు హృదయ ♦ వాటికలందుఁగ్
ఫాలమున సర్పజాతికిఁ
బోలింపఁగ జ్ఞాతియొడల ♦ భువిసకలేశా! 55

క. గమనమున సంచచయమును,
శమదమముల వర్షధరుఁడు ♦ సచ్ఛీలత చేఁ
గోమకుఁడు. కవనము విద్యల
గమిచేతను ; నుతులఁ గాంచు ♦ ఘనసకలేశా! 56

క. రుచి చెడును బండ్లు లేకను
గచభారము లేక చెడును ♦ గాంత్రకు సొగసుల్
సచివుండు లేక పతి చెడు
శుచి లేకను జగము చెడును ♦ శుభ సకలేశా! 57

క. వెంగలిమాటలు కూడవు
యంగనలకు లొంగితిరుగు ♦ టనుచితము ధరగ్
లొంగనిపని కేగుటయును
భంగము తనపూర్వగతికి ♦ భవ సకలేశా! 58

క. దొంగలపొరుగున నుండుట
గంగసమీపమున నిల్లు ♦ గట్టుట తగ న
త్సంగతి విడుచుట యెంతయు
భంగములకుఁ గారణములు ♦ భవ సకలేశా! 59

క. ముదుసలికిఁ జేతికఱ్ఱయు
మది దలఁపఁగ గొడుగు జడిని ♦ మడికాపరికిన్
విదితమగునల్లకంబళి
పదములకును జోడు తోడు ♦ పడు సకలేశా! 60

క. వెచ్చంబున సంసారము
గ్రచ్చులచే గారవంబు ♦ కడుఁగుకవులచే
సచ్చంబగుకబ్బంబులు
హెచ్చవు నిక్కముగ నిమ్మ ♦ హీన్ సకలేశా! 61

క. ధర పైరు చీడచేతను
వరిసస్యంబెల్ల చెడును ♦ వరదలచేతన్
గరి చెడు మావతు లేకను
దురగము చెడుఁ దిప్పకున్న ♦ దొర సకలేశా! 62

క. గండము చెడలకుఁ జీములు,
నిండినచెఱువునకు గండి ♦ నెఱి కోడలికిన్
ముండయగునాఁడుబిడ్డయు
బండికిఁ గడుఁబాడి త్రోవ ♦ భవసకలేశా! 63

క. సుత నమ్ముకొనెడువారికి
సతిదారిద్ర్యంబు తోడు ♦ యాత్రార్థులకున్
మితిలేనితోడు ద్రవ్యం
బతివకుఁ బతిభక్తి తోడు ♦ హర సకలేశా! 64

క. ముండొక్కతె ముత్తైదుకుఁ
బండితునకు శిష్యుఁడొకఁడు ♦ పశుకాపరికిన్
దండంబు నుండవలయును
మండితగుణగణవిభూష ♦ మహి సకలేశా! 65

క. కలువలకు తూటికాఁడయుఁ
జిలుకలకును గండుఁబిల్లి ♦ జీర్ణాంగునకున్,
యలవడినదుర్భరాంగియుఁ
దలఁపఁగ శత్రువులుగారె ♦ ధర సకలేశా! 66

క. పిలువని పెండ్లికిఁ జనుటయుఁ
గలబంధుల వేడఁజనుటఁ ♦ గడునత్తింటన్
నిలుకడగా నుండుటయును
దలఁపఁగఁగడురోతగాదె ♦ ధర సకలేశా! 67

క. యాచకుఁడు విసము పిసిడికి
నాచెన్నఁగ విషము మిగుల ♦ నారంబులకున్
రేచన్న విషము పులికిని
సూచికుఁ డిలకెల్ల విషము ♦ సుమిసకలేశా! 68

క. ఊరిజనంబుల గ్రామణి
భూరమణాధముఁడు జనుల • బుధులను ఖలుఁడున్
సారెకుఁ గోడలి సత్తియు
ఘోరంబుగ వేఁచుచుండ్రు • గురుసకలేశా! 69

క. మశకములు కీడు నిద్రకుఁ
బశువులకును గీడు దొమ్మ • బలుచోరులకున్
శశికాంతి కీడు మఱి కీ
డశనము మందాగ్ని కల్లి • హరసకలేశా! 70

క. జవ్వనికి ముసలిమగఁడును
దువ్వల కాముడిపుట్టకుఁ • దోయదగిరమా
మవ్వంపుటంచగములకు
గువ్వలకును బోయ విషము • గురుసకలేశా! 71

క. చదువొల్లని బాలునకును
మదిఁ దలఁచఁగ నొజ్జ విషము • మఱి పైరులకున్
గదిసెడుపడమటిగాలియు
ముదుసల్లికిఁ జలియు విషము • భువిసకలేశా! 72

క. ఆఁకలి రుచిగై చూపదు
కాకము ధ్వనిసౌష్ఠవంబు • కరి లోతు వెసన్
భేకము జడివానలకును
ప్రాఁకుడు చలికియునుబోలె • మహిసకలేశా! 73

క. తెలిమాచు మావిపూఁతకు
నిలజ్ఞావరి ధనమునకును ♦ నింపగు పులునుఁ
బలుమేహరోగములకును
గాలమునకును ఖలుఁడు చేట ♦ గుఁ సకలేశా ! 74

క. పాత్రిత కెలుఁగనిదానము
గాత్రము లేనట్టిపాట ♦ కదు పండునకుఁ
బుత్రి నిడి చేయుపెండ్లియు
శత్రులతోఁ బొందు కోత ♦ జయ సకలేశా ! 75

క. ఒంటరిగ దారి నడచుట
నింటను గలహంబు మిగుల ♦ నిల కోమటితోఁ
జంటగ వ్యవహారంబును
దంటాలకు మూలమగుఁగ ♦ దాసకలేశా ! 76

క. అంతా మిథ్యని తెలిసియు
కాంతాకనకములయందుఁ ♦ గడుమోహాబ్ధిఁ
భ్రాంతాత్ముఁ డగును మనుజుఁడు
చింతింపఁడు పరముఁ గూర్చి ♦ క్షితిసకలేశా ! 77

క. లేచినది మొదలు కూటికిఁ
జూమటయే కాక నీవు ♦ సుచరిత్రంబుల్
యోచనసేయఁగ సమయము
తోఁచదు నాకేది తెరవు ♦ తుది సకలేశా ! 78

క. పరసతులఁ గూడఁ బాపము
కర మపకీర్తియును లజ్జ • గలుగును మఱియున్
బొరిఁగొను మానముఁ బ్రాణము
సరివారలు వినఁగఁ గేలి • సకలేశా! 79

క. తనయునకు బాల్యమాదిగ
వినయము నమ్రతయు నీతి • విజ్ఞానంబున్
బనిగొని నేర్పినవాఁడే
గాను నిహాపర సౌఖ్యములను • గురుసకలేశా! 80

క. తనయులు ప్రాజ్ఞులు కానిచొ
తన కేమియు సుఖము లేదు • తగ నట్లుండెన్
మనమున వ్యసనము సిగ్గును
విన నపకీర్తియును మిగులు • వెస సకలేశా! 81

క. తనతో సంబంధింపని
పనులకుఁ జొరఁబడుట రోత • జట్టీ పుట్టింపన్
వనిత నిడ రోత కలియని
జనముల బాంధవము రోత • జయ సకలేశా! 82

క. మొదలు తుది లేనిరూపం
బది యిది యని కొల్వ ముక్తుఁ • డౌదునొ కానో
యెద సందియపడుచున్నది
యది మాన్పఁగ నీవె దిక్కు • హర! సకలేశా! 83

క. నిను నమ్మిన తెఱఁగున నే
తనయులఁ దమ్ములను తల్లి ♦ దండ్రుల హితులన్
మనమున నమ్మను నీవే
కని ముక్తి నొసంగవలయు ♦ ఘన సకలేశా! 84

క. నీకన్నఁ దల్లిదండ్రులు
నాకెవ్వరు లేరు భువిని ♦ నను నీకృపచేఁ
జేకొని భవబంధంబులఁ
దాఁకంగానీక ప్రోవు ♦ దయ సకలేశా! 85

క. పాపాత్ముఁడ నని నన్నున్
గాపాడక యున్న నాకు ♦ గతి లేదుసుమీ!
పాపపునాతం దనయుఁడు
వేపడఁ బిత యూరకున్నె ♦ విభుసకలేశా! 86

క. నినుఁ బూజింపనికరములు
నినుధ్యానింపనిమనంబు ♦ నిశ్చలమతితో
నినుఁజూడనికనుఁగవయును
గనుఁగొన వ్యర్థములు గావె ♦ ఘన సకలేశా! 87

క. దేశముల నెన్ని దిరిగిన
కాశిం గలకాల మున్న ♦ కాననసీమన్
వాసముజేసిన వ్యర్థం
బాశలు విడనాడకున్న ♦ హర! సకలేశా! 88

క. ఋతువుల లోన వసంతం
బతివలలోఁ బరమసాధ్వి ♦ యనఘచరితంబున్
మితిలేకయిచ్చుదాతయు
వితతయశము గాంచు నిలను ♦ విభు సకలేశా! 89

క. నీచుఁడు నీచపుఁబనులకు
వేచనుఁ జేయుటకు మిగుల ♦ వెడసూకరముల్
వాచవి గంగాజలములఁ
జూచునె మది రొచ్చుకరించి ♦ శుభసకలేశా! 90

క. కను మూసి పిల్లి తన్నుం
గనుగొనరని పాలుద్రా ♦ గఁ గపటకరించి దు
ర్జనులు తమచేష్ట లోరులకుఁ
గనఁబడకుండునని యెంత్రు ♦ గా! సకలేశా! 91

క. చేడియ మెచ్చును భూషలు
వాడినభూరుహము మెచ్చు ♦ వర్షజలంబున్
పాడిన సరసుఁడు మెచ్చును
పోఁడిమిచెడ జ్ఞాతి మెచ్చు ♦ భువిసకలేశా! 92

క. వైరాగ్యకలన లేకయె
పారదు కన్నంబు పరమ ♦ పదవికిఁగానన్
గోరిక లుడుపుచు పురుషుఁడు
చేరవలయు ధ్యానగరిమ ♦ చే సకలేశా! 93

క. తలఁచిచూచి చేయుకార్యము
కొలఁదితవడక ఖ్యాతిఁజెందు ♦ కొంచెంబైనన్
పరిగంజి చాలు వడకై
పరిపక్వాన్నంబు లేల ♦ భవసకలేశా! 94

క. సరసత పేరము నెఱుఁగని
నరపశువులకు కృతుల నిడుట ♦ నగుబాటుధరన్
బరికింప వయసుబాలను
నెఱి పండునకొసఁగురీతి ♦ నిజసకలేశా! 95

క. ధారుణి నైసర్గికములు
మారును సంసర్గమునను ♦ మఱికోయిలకున్
జేరెను కాకివికారము
కూరిమిచేఁ బెంచికుడుప ♦ గురుసకలేశా! 96

క. ధనమున్నవానిఁ బొగడను
జనపతితోఁ సతనిమంత్రి ♦ జనసర్గముతో
తననంటవాసింపోపెను
ఘనవైరము కీడుదెచ్చుఁ ♦ గద సకలేశా! 97

క. తులలేదు సత్యమునకును
వెలలేదు విరాగతకును ♦ వెసనూహింపన్
గొలలేదు ధర్మవిరతికి
తొలిలేదుర జ్ఞానమునకు ♦ దొరసకలేశా! 98

క. చలిలేదు మిద్దెటింటికి
కలిలే దవివేకులకును ♦ కడుజ్ఞానులకుఁ
వెలిలేదు ఘనులమాటకు
మలిలేధుర లేశమైన ♦ మహిసకలేశా ! 99

క. వేంకటుకవికిని సుతుఁడను
పంకజగర్భాన్వయుండ ♦ వరభారద్వా
జాంకుఁడసూర్యారాయశ
శాంకుస కాశీశుఁడఁ బ్రోవు ♦ మాసకలేశా ! 100

సకలేశ్వరశతకము.

సంపూర్ణము.

